తాళ్లపాక పదసాహిత్యం - సంపుటం - 19

# శృంగార సంకీర్తనలు

(తాళ్లపాక అన్నమాచార్య విరచితములు)

పరిష్కర్త
కీ॥ శే॥ గౌరిపెద్ది రామసుబ్బశర్మ




ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు
1998

T.T.D. Religious Series - 551

ప్రథమ ముద్రణ : 1977
ద్వితీయ ముద్రణ : 1998





ప్రతులు : 2,000

వెల : రు. 29-00

ప్రచురణ :
శ్రీ M.K.R. వినాయక్, I.A.S.
కార్యనిర్వాహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.




ముద్రణ :
త్రివేణి ఆఫ్‌సెట్ ప్రింటర్స్
14/264, ఈడేపల్లి
మచిలీపట్నం - 1
ఆంధ్రప్రదేశ్

# విన్నపము

ఇందరికి అభయంబు లి...్చు చేయి
కందువగు మంచిబంగారు చేయి ॥

కలియుగ ప్రత్యక్షదైవమైన శ్రీ వేంకటేశ్వరుని వైభవాన్ని, మాహాత్మ్యాన్ని, తత్త్వాన్ని 32,000 అధ్యాత్మ, శృంగార సంకీర్తనలుగా రచించినవాడు తాళ్లపాక అన్నమాచార్యులు. ఇందులో మనకు సుమారు 13,000 సంకీర్తనలు మాత్రమే లభించాయి. వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు పదకవులే ! తాళ్లపాక కవులు క్రీ॥శ॥ 15-16 శతాబ్దాలకు చెందినవారు. వీరి స్వస్థలం ఆంధ్రప్రదేశ్‌లోని కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్లపాకగ్రామం.

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో వైష్ణవమత ప్రచారం కోసం తిరుమలను కేంద్రంగా చేసుకొని శ్రీ వేంకటేశ్వరాంకితంగా వేలకొలది సంకీర్తనలను, ఇతర సాహిత్య ప్రక్రియలను రచించినవారు తాళ్లపాకకవులు. శ్రీ వేంకటేశ్వరస్వామివారి సేవలో తరించిన ధన్యమూర్తులు.

తాళ్లపాక పదకవిత్రయంగా కీర్తిగడించిన తాళ్లపాక అన్నమాచార్యుల, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్యల సంకీర్తనల రాగిరేకులు తిరుమలలో శ్రీవారి ఆలయంలో 'తాళ్లపాక అర'లో లభించాయి.

తాళ్లపాక కవుల సంకీర్తనల భాండాగారం గూర్చిన మొదటి శాసనం క్రీ॥శ॥ 1530 సంవత్సరంలో కనిపిస్తుంది. తదుపరి క్రీ॥శ॥ 1545, 1547, 1554, 1558 సంవత్సరాల నాటి శాసనాల్లోను సంకీర్తనభాండాగారం గూర్చిన ప్రస్తావన కనిపిస్తుంది. ఇవి తిరుమల తిరుపతి దేవస్థానాల శాసనాలు.

తిరుమల తిరుపతి దేవస్థానములవారు క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి తాళ్లపాక కవుల సంకీర్తనల ముద్రణకు పూనుకొన్నారు. క్రీ॥శ॥ 1922 సంవత్సరం నుండి క్రీ॥శ॥ 1992 సంవత్సరం వరకు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాల ముద్రణలో వివిధ దశలు కనిపిస్తాయి.

1922 సంవత్సరంలో తిరుమల తిరుపతి దేవస్థానాలవారు రాగిరేకుల్లోని తాళ్లపాక కవుల సంకీర్తనలను వ్రాతప్రతుల్లో వ్రాయించటానికి పూనుకొన్నారు.

1935-38 సంవత్సరాల్లో తాళ్లపాక లఘుకృతులు, తాళ్లపాక కవుల సంకీర్తనలు సంపుటాలుకొన్ని వెలువడ్డాయి.

1947-65 సంవత్సరాల్లో తాళ్లపాక కవుల అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు కొన్ని సంపుటాలు ముద్రించబడ్డాయి.

1947-1965 సంవత్సరాల మధ్యకాలంలో నిరాఘాటంగా కొనసాగిన తాళ్లపాక పదకవుల సంకీర్తనల ముద్రణ తరువాత ఒక దశాబ్దంపాటు కొనసాగలేదు.

1975-1986 సంవత్సరాల మధ్యకాలంలో తాళ్లపాక పదకవుల సంకీర్తనలు కొన్ని సంపుటాలు వరకు, మరియు అధ్యాత్మ సంకీర్తనలు కొన్ని సంపుటాలు పునర్ముద్రింపబడ్డాయి.

తదుపరి 1992 సంవత్సరంలో ఒక సంపుటం ముద్రింపబడినది.

ఇంతేకాక తాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్ర, తాళ్లపాక కవుల ఇతర సాహిత్య ప్రక్రియలను ఈ దశల్లోనే తిరుమల తిరుపతి దేవస్థానం ముద్రించింది.

ఈ వివిధ దశల్లో తాళ్లపాక పదకవుల సంకీర్తనలను రాగిరేకులనుండి పరిష్కరించిన మహాపండితులు కీ॥శే॥ సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి, పండిత విజయరాఘవాచార్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, పి.టి. జగన్నాథరావు, గౌరిపెద్ది రామసుబ్బశర్మ, శ్రీయుతులు ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారలు.

తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించినప్పటినుండి తాళ్లపాక అన్నమాచార్య సంకీర్తనలకు దేశవ్యాప్తంగా విశేషవ్యాప్తి ఏర్పడింది. తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు సాహితీవేత్తలకు, సంగీత విద్వాంసులకు వరకవిత్వ వాణీవీణా నినాదాలైనాయి. ఈ సంకీర్తనలు భక్తులకు మోక్ష మార్గాన్ని తెలిపే విశిష్టరచనలు. పరిశోధకులకు, సాహిత్యచరిత్రకారులకు కొంగుబంగారమై విలసిల్లుతున్నాయి. తాళ్లపాక కవుల సంకీర్తనలకు సంగీత, సాహిత్య, భక్తలోకంలో నేడువున్న ఆదరణ ఎనలేనిది.

ఈ ఆవశ్యకతను గుర్తించి వివిధ దశల్లో పరిష్కరింపబడి, ముద్రించబడిన తాళ్లపాకకవుల సంకీర్తనలను ఒక్కసారిగా సమగ్రరీతిలో ముద్రించడానికి తిరుమల తిరుపతి దేవస్థానాల యాజమాన్యం సంకల్పించింది.

ప్రథమతః తాళ్లపాక కవుల సంకీర్తనలను సమగ్రంగా 29 సంపుటాలుగా లోకానికి అందిస్తున్నాం.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళిక రూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులుగారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త) విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందం గారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యూమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) డా॥ ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరెక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M A.,Ph D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) హృదయపూర్వక కృతజ్ఞతాంజలులు అర్పిస్తున్నాము.

దీని తర్వాత తాళ్లపాక కవుల లఘుకృతులు, ఇతర కావ్యాలు వెలువరించడానికి ప్రణాళిక సిద్ధంచేస్తున్నాం.

ప్రస్తుతం వెలువడుచున్న తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు శ్రీ వేంకటేశ్వర స్వామివారి కృపా కటాక్షంచే భక్తజనామోదం పొందగలవని విశ్వసిస్తున్నాం.

**M.K.R. వినాయక్**
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు

# నివేదిక

క్రీ॥శ॥ 15వ శతాబ్దంలో భక్తి, ప్రపత్తి, దేహాత్మేశ విచారాదులను తెలిపే అధ్యాత్మసంకీర్తనలు; జీవాత్మ, పరమాత్మల ఐక్యాన్నిచాటే అమలిన దివ్య శృంగార సంకీర్తనలు రచించినవారు తాళ్లపాక కవులు. సకల దేవతా స్వరూపమైన శ్రీ వేంకటేశ్వరస్వామి తత్త్వాన్ని ఎన్నోవేల సంకీర్తనలద్వారా లోకవిదితంచేసి ఆత్మకల్యాణంతోపాటు లోక కల్యాణం సాధించిన వారు తాళ్లపాక అన్నమాచార్యులు, వీరి పుత్రుడు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, మనుమడు తాళ్లపాక చినతిరుమలాచార్యులు. శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వంగా భావించి ఉభయ విభూతినాయకుడైన ఆ స్వామి కల్యాణగుణాలను ఎన్నోవేల సంకీర్తనల్లో కీర్తించారు. శరణాగతి తత్త్వాన్ని ప్రబోధించారు.

క్రీ॥ శ॥ 15వ శతాబ్దంలో శ్రీ వేంకటేశ్వరస్వామివారి నందకాంశ సంభూతుడుగా తాళ్లపాక అన్నమాచార్యులు జన్మించాడు. తన పదహారవయేట శ్రీ వేంకటేశ్వరుని సాక్షాత్కారం పొంది స్వామి ఆదేశంతో సంకీర్తనరచనకు శ్రీకారం చుట్టి ఆనాటినుండి జీవితాంతంవరకు దినమునకు ఒక్క సంకీర్తనకు తక్కువ కాకుండా సంకీర్తన రచన సాగించాడు. పల్లవి, చరణాలతో కూడిన సంకీర్తన రచనకితడు మార్గదర్శకుడై 'పదకవితాపితామహుడ'ని కీర్తి గడించాడు. అన్నమయ్య పదాలలో సంగీతం, సాహిత్యం, భగవద్భక్తి త్రివేణీ సంగమంలా మేళవించాయి.

శ్రీ వేంకటేశ్వరుని పరతత్త్వమూర్తిగానే కాకుండా వివిధ ఆగమ సంప్రదాయాల్లో వినుతుడైన వైభవమూర్తిగా కూడా అన్నమయ్య కీర్తించాడు. ఆంధ్రవాగ్గేయకారుల్లో అనేక వైష్ణవ క్షేత్రాలను సందర్శించి ఆయాక్షేత్ర మూర్తులపై వివిధ సంకీర్తనలను రచించిన ఘనత తాళ్లపాక అన్నమాచార్యులదే!

అన్నమయ్య భగవత్తత్త్వాన్ని అనేక జానపద గేయరీతుల్లో రచించి సామాన్యులకు అందించే ప్రయత్నంచేశాడు. అన్నమయ్య గ్రాంథిక, శిష్టవ్యావహారిక, వ్యావహారిక భాషాశైలులలో సంస్కృతాంధ్ర సంకీర్తనల్ని రచించాడు. జానపదుల జీవద్భాషను సర్వతంత్ర స్వతంత్రంగా వాడి సంకీర్తనల రచనాశైలిలో తర్వాతి వాగ్గేయకారులకి మార్గదర్శకుడైనాడు.

అన్నమయ్య పదాలు శ్రీ వేంకటేశ్వరముద్రాంకితాలు. వీరి బాటను అనుసరించిన వారు తాళ్లపాక పెదతిరుమలాచార్యులు, తాళ్లపాక చినతిరుమలాచార్యులు.

ఇహపర శ్రేయోదాయకమైన తాళ్లపాక అన్నమాచార్యులు, ఇతర తాళ్లపాకకవుల సంకీర్తనలను భక్తజనానికి అందించాలని తిరుమల తిరుపతి దేవస్థానములు 1978 సంవత్సరంలో సంకల్పించి అన్నమాచార్య ప్రాజెక్ట్ స్థాపించింది. అప్పటినుండి అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే గానంచేయబడిన తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలు ఆంధ్ర ప్రదేశ్‌లోనే కాక, ఆంధ్రేతర రాష్ట్రాలలో కూడా బహుళ ప్రచారం, ప్రాచుర్యం పొందాయి.

అన్నమాచార్య ప్రాజెక్ట్ తాళ్లపాక అన్నమాచార్య, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనల ప్రచారం-పరిశోధన -రికార్డింగ్ శాఖల సమన్వయంతో వివిధ కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. అన్నమాచార్య ప్రాజెక్ట్ కళాకారులచే వేలకొలదిగా సంగీత సభలు, పరిశోధకులచే సాహితీసమావేశాలు నిర్వహించింది. మరియు తాళ్లపాక కవుల సంకీర్తనలను ఆడియో క్యాసెట్లుగా విడుదలచేసి బహుజనామోదం పొందింది.

తిరుమల తిరుపతి దేవస్థానంచే 1949 సంవత్సరం నుండి ప్రతి సంవత్సరం అన్నమాచార్య వర్ధంతి ఉత్సవాలు, 1978 సంవత్సరం నుండి అన్నమాచార్య జయంతి ఉత్సవాలు జయప్రదంగా నేటికీ నిర్వహింప బడుచున్నవి. మరియు అన్నమాచార్య సంకీర్తనోత్సవాలు కుగ్రామ స్థాయినుండి మహానగరాలస్థాయివరకు జరుగుచున్నాయి. అన్నమాచార్య ప్రాజెక్ట్ వివిధ విశ్వవిద్యాలయాల

సమన్వయంతో తాళ్లపాక కవుల సాహితీ సదస్సులు నిర్వహిస్తున్నది. తిరుమల తిరుపతి దేవస్థానం 1978సం॥ నుండి తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సాహిత్యంపై వివిధ విశ్వవిద్యాలయాల్లో పరిశోధన చేసేవారికి ఉపకారవేతనం ఇచ్చి ప్రోత్సహిస్తున్నది. ఈ ప్రణాళిక క్రింద ఇప్పటివరకు దాదాపు 50 సిద్ధాంతవ్యాసాలు సమర్పింపబడ్డాయి.

తాళ్లపాక అన్నమాచార్యుల, ఇతర తాళ్లపాక కవుల సంకీర్తనలపట్ల నానాటికీ పెరుగుచున్న ప్రజాదరణ, మరియు 1935వ సంవత్సరం నుండి వివిధ దశల్లో ముద్రింపబడిన తాళ్లపాక అన్నమయ్య, తాళ్లపాక పెదతిరుమలయ్య, తాళ్లపాక చినతిరుమలయ్య సంకీర్తనల సంపుటాలు ఏనాడో చెల్లిపోయిన కారణంగా నేడు తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు సమగ్రంగా పునర్ముద్రించవలసిన ఆవశ్యకత ఏర్పడింది.

పూర్వముద్రణ సంపుటాల్లోని పూర్వపరిష్కర్తల పీఠికలు యథాతథంగా ముద్రింప బడుచున్నాయి. పరిష్కర్తచే పీఠికలో సూచింపబడిన సంపుటాల సంఖ్యలు పూర్వముద్రణకు సంబంధించినవి. తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలు మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రితమవుతున్నందువల్ల ముద్రణ, పాఠకుల సౌకర్యార్థం క్రమపద్ధతిలో వుండాలనే వుద్దేశ్యంతో పూర్వముద్రణ సంపుటాల సంఖ్యలు మార్చబడినవి. సంపుటాల సంఖ్యల మార్పులు ప్రత్యేకంగా పట్టికలో చూపబడింది.

తిరుమల తిరుపతి దేవస్థానానికి రాగిరేకుల్లో లభించిన తాళ్లపాక కవుల సంకీర్తనలు మొత్తం నేడు ముద్రించబడుచున్నందువల్ల సమగ్రమనే పదం సూచికంగా వాడబడింది.

భక్తిభావ విలసితాలైన తాళ్లపాక కవుల సంకీర్తనల సంపుటాలను సమగ్రంగా ముద్రించుటకు ఆమోదించిన తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మకర్తృత్వమండలి అధ్యక్షులు శ్రీకలిదిండి రామచంద్రరాజుగారికి, మరియు ధర్మకర్తృత్వమండలి సభ్యులకు మా హార్దిక కృతజ్ఞతాంజలి.

ఈ సంపుటాల ముద్రణకు ఆధికారికమైన ఆమోదాన్ని తెలిపిన తిరుమల తిరుపతి దేవస్థానముల కార్యనిర్వహణాధికారి శ్రీ ఎం.కె.ఆర్.వినాయక్ I.A.S. గారికి కృతజ్ఞతాంజలి.

తాళ్లపాక పదకవుల సంపుటాల పునర్ముద్రణ ప్రణాళికరూపొందించుటలో సహకరించిన శ్రీ ఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారికి (తాళ్లపాక వాఙ్మయపరిష్కర్త), విద్వాన్ శ్రీ సింగరాజు సచ్చిదానందంగారికి (విశ్రాంత తెలుగు అధ్యాపకులు, తిరుమల తిరుపతి దేవస్థానాలు) ఆచార్య కె. సర్వోత్తమరావుగారికి (డీన్, హ్యుమానిటీస్ & ఎక్స్‌టెన్షన్ స్టడీస్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) ఆచార్య ఎం. శ్రీమన్నారాయణమూర్తిగారికి (డైరక్టర్, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాసంస్థ, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి) మరియు ఈ సంపుటాల ముద్రణలో సాహిత్యపరంగా నిర్మాణాత్మకమైన సూచనలందించిన డా॥ముదివేడు ప్రభాకరరావు M.A.,Ph.D గారికి, (పరిశోధకులు, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయం, తిరుపతి) మా హార్దిక కృతజ్ఞతాంజలులు.

ఈ సంపుటాల ముద్రణలో సాంకేతికపరమైన సహకారాన్ని అందించిన తిరుమల తిరుపతి దేవస్థానముల ముద్రణాధికారి శ్రీ ఎం. లక్ష్మణరావుగారికి, వారి సిబ్బందికి, తి.తి.దే పౌరసంబంధ శాఖాధికారి శ్రీ పి. సుభాష్‌గౌడ్ గారికి కృతజ్ఞతాంజలులు.

డా॥ మేడసాని మోహన్ M.A., Ph.D
డైరక్టర్
అన్నమాచార్య ప్రాజెక్ట్
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి.

తేది : 10-2-98

## తాళ్లపాక పదకవుల సంకీర్తనల సంపుటాలు

## సంఖ్యా వివరణ పట్టిక - 1998

| సంపుటాలు | మునుపటి సంఖ్య | ఇప్పటి సంఖ్య | సంకీర్తనాచార్యుని పేరు |
|---|---|---|---|
| అధ్యాత్మ సంకీర్తనలు | 1 | 1 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 2 | 2 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 3 | 3 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 10+11(1,2భాగాలు) | 4 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 12 | 5 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 4 | 6 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 13 | 7 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 14 | 8 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 15 | 9 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ, శృంగార సంకీర్తనలు | 16 | 10 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 17 | 11 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 18 | 12 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 19 | 13 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 20 | 14 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| అధ్యాత్మ సంకీర్తనలు | 21 | 15 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 22 | 16 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 23 | 17 | తాళ్లపాక పెదతిరుమలాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 24 | 18 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 25 | 19 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 26 | 20 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 27 | 21 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 28 | 22 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 29 | 23 | తాళ్లపాక అన్నమాచార్యులు |

| | | | |
|---|---|---|---|
| శృంగార సంకీర్తనలు | 30 | 24 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 31 | 25 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| శృంగార సంకీర్తనలు | 32 | 26 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 33 | 27 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 34 | 28 | తాళ్లపాక అన్నమాచార్యులు |
| *శృంగార సంకీర్తనలు | 35 | 29 | తాళ్లపాక అన్నమాచార్యులు |

* తాళ్లపాక పదసాహిత్యం మొదటిసారిగా సమగ్రంగా పునర్ముద్రణచేయ బడుచున్నది. ఈ సందర్భంగా సంకీర్తనల సంపుటాల సంఖ్యలు క్రమపద్ధతిలో ఉండాలనే వుద్దేశ్యంతో మార్పులు చేయబడి, పై పట్టికలో చూపబడినవి. పై పట్టికలోని మునుపటి సంఖ్య వరుసలో సూచింపబడిన 33, 34, 35 సంపుటాలు ఇంతవరకు ముద్రింపబడలేదు. ఇప్పుడు ప్రథమంగా ప్రచురింపబడుతున్నాయి. అయినప్పటికి ప్రస్తుతం 1998 సం॥లో క్రొత్తగా 1వ సంపుటం నుండి ఇవ్వబడిన క్రమ సంఖ్యలు ఈ ప్రథమ ముద్రణ సంపుటాలకు చేర్చబడినది. ఈ మార్పును సహృదయ పాఠకులు గమనించగలరు.

# పీఠిక

**ఆత్మానం నాయికాం కృత్వా రచనాం రసవాహినీమ్।**
**అర్పయద్వేంకటేశాయ యః కృతీ తముపాస్మహే॥**

ఇరవైనాల్గవ సంపుటమున, ఇకమీదట ప్రతిసంపుటమునను ఒక్కొకవిషయమును గూర్చి చర్చించుటకు సంకల్పించినట్లు మనవి చేసియుంటిని. భాషామర్యాదలకు, భావసంపదలకు, అలంకార విశేషములకు, తాళ్లపాకకవులవాఙ్మయరాశిలో వెలితి కానరాదు.

ఈ సంపుటమునందు ముఖ్యముగ 1. అనుస్వారము, 2. రాగి రేకులవ్రాతలో కొన్ని విశేషములు అను రెండంశములను గూర్చి యథామతి సంగ్రహముగ ముచ్చటింపదలచితిని.

## 1. అనుస్వారము

ఈ అనుస్వారమును చర్చించుటకుముందు దీనికి పూర్వరూపమైనవర్ణములనుగూర్చి కొంత విచారింపవలసి యున్నది. మూల-రూపములను చర్చించునపుడు కొంత దీర్ఘప్రస్తావనగూడ అవసరమే.

పాణినీయ వ్యాకరణమున లఘు గురువులను నిరూపించుచు, "హ్రస్వం లఘు" 1_4_10 "సంయోగే గురు" 1_4_11 "దీర్ఘంచ" 1_4_12 అని సూత్రించియున్నారు. దీనివలన, "అచల" వంటి వర్ణములు లఘువులని "అన్యత్ర" లో క్రికీగీతలు గల వర్ణములు గురువులని, అట్లే "పారావార" లో దీర్ఘము లన్నియు గురువులని తేలుచున్నది. గురులఘు నిర్వచనము ఛాంద సులకు (ఛందశ్శాస్త్రజ్ఞులకు,) ప్రధానమైనను వారుగూడ కొంత వరకు వ్యాకరణము ననుసరించియే సాగించినారని తోచుచున్నది. అందువలన ఈ గురులఘు విషయమున వ్యాకరణశాస్త్రమునుగూడ ప్రస్తావించితిని. పై శాస్త్రమును గురిగా చూచితిమేని "సంయమి"

వంటిపదములలో సున్నతో గూడిన 'సం' అనునది గురువగుటకు వ్యాకరణములోఆధార మగపడదు, కాని ఛందశ్శాస్త్రకర్తలు,

శ్లో॥ "దీర్ఘం సంయోగపరం తథా ప్లుతం వ్యంజనాంత మూష్మాన్తం।
సానుస్వారం చ గురు క్వచిదవసానేఽపి లఘ్వన్త్యమ్॥"
(పిం–సూ–1–4)

అని వాకొని యున్నారు. దీనికి గూడ యేదో వ్యాకరణ సంబంధము కలదని భావన. నిరాధారముగ వట్టి మర్యాదపాటగ ఛాందసులు చెప్పియుండరు గదా!

అనుస్వారముతో కూడిన 'సంయమి' వంటి పదముల స్వరూపమును విచారింతము. 'సమ్ + యమి' అనునప్పుడు "మోఽను స్వారః" 8_3_23 అనుసూత్రముచే మకార మనుస్వారమై 'సంయమి'గా మారుచున్నది. ఇట్లే సంవాద సంబంధాదులు. సంస్కృతమునస్పైనచో 'హరిమ్ + వందే' ఇత్యాదులలో 'హరిం వందే' ఇత్యాదిగ మారుటయు పైసూత్రప్రభావమే. ఇది నిత్య సూత్రమే; కాని, యీసూత్రముతో మకార మనుస్వారముగ మారనిపక్షమున[1] 'సయ్యమి' 'సవ్వాద' ఇత్యాదిగ రూపము లుండ వలసివచ్చుగదా. అప్పు డాసకారము సంయోగపరము కావున "సంయోగే గురు" అను సూత్రముచే తప్పక గురువు కాగలదు. అందువలననే మకారస్థానీయమైన అనుస్వారమును గూడ సంయుక్తముగ భావించి దానికి ముందున్న వర్ణమునకు గురుత్వము ఘటింపియుందురు. అట్లే 'అన్ + కితః' శామ్ + తః' ఇత్యాది యేకపదములందును "నశ్చాపదాన్తస్య ఝలి" 8_3_24 అను సూత్రముచే సకార మకారములు సున్నలుగమారి 'అంకిత' 'శాంత' వంటిరూపములు కాగా, "అనుస్వారస్య యయి పరసవర్ణః" 8_4_58 సూత్రముచే పరసవర్ణము వచ్చి 'అఙ్కిత' 'శాన్త' ఇత్యాదిగ సంస్కృతమున రూపము లగుచున్నవి.

---

1. 'ఆంధ్రాక్షరతత్త్వము' లో పాడి-వేంకటస్వామిగారి వాదమిది

అనునాసికాక్షర సంయోగమున్న స్థలములందంతట సున్ననే పాటించి 'అంకిత' 'శాంత' ఇత్యాదిగ వ్రాయుట మన తెనుగువారి సంప్రదాయము. దీనికి "యయితద్వర్గాన్తః" (ప్రాకృతప్రకాశము 4-17) అను వైకల్పిక సూత్రము ఆధారమని చెప్పుటయు కలదు. 'బిందుల్' (1-1-40) (ప్రాకృతమణిదీపిక) అను సూత్రమునందలి నిత్య విధి కారణమనుట బాగుండునేమో? "అఙ్కిత" 'కాఞ్చన' వంటివి 'అంకిత' 'కాంచన'ములుగామారుటకు పై ప్రాకృతపద్ధతినే మన తెలుగువారు అవలంబించి యుందురు. పై నిరూపించినకారణ ములతో వ్యస్త, సమస్త పదములయందు అనుస్వారమునకు (బిందు-వుకు), సాధారణముగ మూలరూపములోని అనునాసికాక్షరములు కారణములగుచున్నవని తేలినది.

ఈ బిందువు మన తెలుగుబాసలో సిద్ధ, సాధ్య, ఖండాఖండ [(ం) (ం)] భేదములతో నుండుట మరీ వినోదకరము. సిద్ధ బిందువుగల పదములందు దానిమూలరూప మందలి అనునాసికాక్షరమును మాత్రము పరిశీలించినచో చాలును. మన తెనుగునకు సంస్కృత, ప్రాకృత, తమిళ, కన్నడపదములు మూలరూపములగుటచే, వానిలో అనునాసికాక్షరమున్నచో వానినుండి బుట్టిన మన తెనుగుపదములందు, యథాశాస్త్రముగ సున్న లరసున్నలు పర్పడి యుండును. పదాద్యక్షరములపై సున్న లరసున్న లేర్పడునపుడు, పదాద్యక్షరము లఘువైనచో దానిపై వచ్చు సున్న నిండుసున్న గను, పదాద్యక్షరము దీర్ఘమైనచో దానిపై వచ్చుసున్న అరసున్న గను, తక్కినస్థలములయందు వచ్చుసున్న ఉభయాత్మకముగను ఉండుట మన తెనుగుశాస్త్ర సంప్రదాయము. ఉదా: 'దణ్డః' సంస్కృతము' 'దంటు' తెలుగు, 'కాణ్డః' సంస్కృతము 'కాండ, తెలుగు. ఇట్లే తమిళమునందుగూడ సంస్కృతము నందువలె సున్నలకు బదులుగ అనునాసికాక్షరసంయోగముతో వ్రాయుటయే పద్ధతిగా

కనబడుచున్నది కావుననే ఉదా: 'ఉరోగ్గిల్' అను తమిళ పదము "రోఁకలి" గా 'శేణ్డు' అనునది 'చేఁదు' గను 'అన్దో౯ౖౖ' అనునది 'అఁదోఁక' గను, అట్లే 'దాఁటు' అను కన్నడపదము 'దాఁటు,' 'దూంటు,' 'దూఁటు', గ మారుట గుర్తింపదగిన విషయము.

ఇక్కడ ఒకవిషయము విచారింపవలసియున్నది. మూల పదములలో అనునాసికాక్షరములు లేకపోయినను తద్భవములలో అనుస్వారములుండుట, మూలసంస్కృతములో 'అనునాసిక, అను స్వార' అక్షరమున్నను తద్భవములలో అనుస్వారము లేకుండుటయు పై సిద్ధాంతమునకు విరుద్ధముగ తోచుచున్నది. 'వక్ర' శబ్దము 'వంకర' గా, 'స్త్రీ' శబ్దము 'ఇంతి' గా, 'కక్ష' శబ్దము 'చంక' గా మారునపుడు ఈ విరోధము స్పష్టముగ తెలియుచున్నది. కాని 'వక్ర' శబ్దము వంటి వానిలో అనుస్వారమును "వక్రాదిషు" (ప్రా. ప్ర. 4–15) సూత్రముచే ప్రాకృతవైయా కరణులు సాధిం చిరి. దానినే మనవా రాదరించిరి. 'ఇంతి' శబ్దములో భ్రాంతి చేతను'చంక'లో భ్రాంతి–వర్ణవ్యత్యయములచేతను బిందువులు సాధించు చున్నారుగదా! అనుస్వార, అనునాసికములు గల్గిన 'మాంసాది' శబ్దములు తద్భవములలో అవిలేకుండ ప్రయోగించుటను "మాంసా దిషు వా" (ప్రా. ప్ర. 4–16) అనుసూత్రముచే ప్రాకృతవైయా కరణులు సమర్థించిరి.

సిద్ధ సాధ్య ఖండాఽఖండ బిందు స్వరూప మిట్లుండగా తాళ్లపాక అన్నమాచార్యులకీర్తనలలో పై విధులను అన్నిటిని దాటిన ప్రయోగములు కొన్ని కానవచ్చుచున్నవి. అందుకొన్ని నాబోటివాని జ్ఞానమితికి సహేతుకములుగా, కొన్ని హేతుదూర ములుగా కనపడుచున్నవి. తెనుగువాఙ్మయమున ఇతరకవుల ప్రయోగములలో 'యేమిటికి' అనుశబ్దసంగ్రహరూపమైన 'ఏటికి'

అనునది అర్ధానుస్వారరహితముగనే యున్నది. కానీ ఈ వాఙ్మయము నందంతట ఆశబ్దము 'ఏఁటికి' అని సార్ధానుస్వారముగనే కన్పట్టుచున్నది. మూలపదములోని మకారము లోపించుటచే ఆస్థానములో అర్ధబిందువుండుట న్యాయ్యముగనే తోచుచున్నది. మాట, మాటు, మాటికి శబ్దములందు ఈవాఙ్మయము నందచ్చటచ్చట అర్ధానుస్వార ముఁడుట కొంత విచిత్రమే. కాని మాట శబ్దములో అర్ధానుస్వారము హేతువాదమునకు, పూర్వప్రయోగములు సాక్షిగా తోచుచున్నను, మాటు, మాటికి పదములలో హేతువు కనబడుటలేదు. అట్లే "కడ + కడ = కట్టకడ" అనురూపము 'కట్టఁగడ' గ ఈ వాఙ్మయమునందు కనపడుచున్నది. ఇది తమిళ సంప్రదాయమా యనిపించుచున్నది. 'అంట' (అనుట) కు రూపాంతరమగు 'అఁట' లో 'ఎసఁగు' మొదలగు నిత్యసార్ధానుస్వారములైన రూపములలో అర్ధానుస్వారము లేకఁడుటయు నీవాఙ్మయమున విచిత్రమే. 'ఎసఁగు' లో నొక్కొకచోట కనపడినను 'అఁట' లో మాత్రము ఇంతవరకు నాదృష్టి కెచ్చటను అరసున్న కనపడలేదు. 'రాఁగు' 'రాఁపు' అని సార్ధానుస్వారము లున్నవి. 'రంగు' రాఁగైతే, 'రంపు' రాఁపైతే పరవాలేదు.

అన్నమాచార్యులు భాషావిషయమున భావకల్పనమున చాలస్వతంత్రుడు. ఆయన ఈపదములను ఏదృష్టితో ప్రయోగించెనో, దానిని పెద్ద తిరుమలాచార్యులవారు ఎంత పరిశీలించి రేకులపై చెక్కించిరో, ఇందు పోగరపనివారి కైవాడ మెంత యున్నదో చెప్పలేము. మనకు లభించిన శాస్త్రములను, మనము చదివిన చదువును ఊతగా చేసికొని ఆయన భాషాపాండిత్యము కొలవలేము. ఇకపై అన్నమాచార్య భాషా సారస్వతములను సూటిగా విమర్శింపగల పెద్దలు పై విషయములను సహేతుకముగ నిర్ధరింపగలరు.

ప్రాతకాలపు వ్రాతలలో అరసున్న కానరాదు. అంతటా నిండుసున్నయే. కాని ద్విరుక్తాక్షరములకు ముందున్న నిండుసున్న పూర్ణానుస్వారముగ, అద్విరుక్తములైన హల్లులకు ముందున్న నిండు సున్న అరసున్నగా గుర్తించు సంప్రదాయము గలదు.

## 2. రాగిరేకుల వ్రాతలోని విశేషములు

పై చెప్పినవిధముగనే ఈ రేకులలో అరసున్న నిండుసున్నల-వ్రాత నిండియున్నది. కాని కొన్నియక్షరములయందు పలుతావుల ఆ పద్ధతి భేదించియున్నది. ఉదా:- రేకుల వ్రాతపద్ధతిప్రకారము, 'ఎంతైనా' 'ఎద్దాంకా' ఇత్యాదిగా వ్రాయవలసిన స్థలములలో 'ఎంతైనా' 'ఎందాంకా' అనియు, 'కాంబోది' అని వ్రాయవలసిన స్థలములలో 'కాంబోది' అనియు 'సుఖంబ్బు' అని వ్రాయవలసిన స్థలములలో 'సుఖంబు' అనియు వ్రాత మాటిమాటికి కనపడుచున్నది. ఇట్టి స్థలములయందు మేము 'ఏఁ (ఎం?) తైనా' ఇత్యాదిగా సూచించుచున్నాము. ఇట్టి వ్రాత అక్కడక్కడ విరివిగానుండుటచే ఈ సూచనలు అచ్చులో కొంతవికారముగ గన్పట్టునని, పదములను సందర్భములను అనుసరించి 'ఎంతైనా' అని పుంటేగూడ సూచన యివ్వకుండ 'ఎంతైనా' ఇత్యాది మామూలుగనే వ్రాయుచున్నాము. కారణము పై తెల్పిన వికారము తొలగించుటయే. అట్లే పెక్కుచోట్ల 'వ్రాయు' టకు, 'వాయు' అనియే రేకులలో కన్పడుచున్నది. దానికిని పైవిధముగ [వా(వ్రా?)] సూచించుచు వచ్చితిమి. ఇదియు ననంతమగుటచే అచ్చులో వికారమును తొలగించుటకై 'వాయు' ను 'వ్రాయు' గనే వ్రాయుచున్నాము. 'భ్రమయుకు' [1]'భ్రమయు' అనియే పలుతావుల గలదు. బతుకు, బలిమి ఇత్యాదులలో 'బ' ప్రత్యేకముగ కనపడుటచే, 'భ్ర' లో మహాప్రాణ సూచకమగు ఒత్తు లోపించియుండునని 'భ్ర' గనే వ్రాయుచున్నాము. ఎచ్చటైన అర్థముతో సందర్భముతో పెద్దగా సందేహము తోచునపుడు సూచన

---

1. తలకట్టుగ ఐవర్ణ మిప్పు డచ్చులో లేదు.

లిచ్చుట అచ్చులో అంత బాధకము కాదుగాని, చేతిపనివారిపొర పాటుతో అక్కడక్కడ దొరలిన యీ చిన్ని దోసములకు అచ్చులో సూచనలిచ్చుట వ్యర్థ మనిపించినది.

ఇక్కడింకొక విషయముకూడ గమనింపవలసి యున్నది. రేకులలోని పంక్తులకు ముందుగ ఒకపద్ధతి ప్రకారము గీతలు గీచుకొని తగినంత యెడమిచ్చి అక్షరములు చెక్కుతూవచ్చిరి. అందు 'ఎంత్తై' అనుస్థలమున 'తా' వత్తు (ు) 'ఐత్వము' (ై) లకు చాలినంత స్థలము దొరక నప్పుడెల్లా ఈపని చేసిరే మోయని తోచుచున్నది. ఒక 'త్తై'కి ఈహేతువు చెప్పవచ్చుగాని, పై దెలిపిన మిగత వర్ణముల విషయమున నేమి చెప్పుటకూ తోచదు, చేతిపొరపాటుగనే గుర్తింప వలసియున్నది. ఇట్టి ప్రమాదము ఇతర పదములందును గలదు.

ఈ వాఙ్మయపరిష్కరణమున తమ నిండు సహకారములను ఉత్సాహమును చూపుచున్న తి. తి. దేవస్థానము కమిటీ అధ్యక్షులు శ్రీ సి. అన్నారావుగారికి, ఈ వాఙ్మయరాసిక్యమును లోకమునకు నెంతోగొప్పగ అందివ్వవలెనను ఆసతో పనిచేయుచుచున్న తి. తి. దేవస్థానముల కార్యనిర్వహణాధికారులు శ్రీ పి. యస్. రాజగోపాల్ రాజు, ఐ. ఏ. యస్., గారికిని నా ధన్యవాదములు. మాకు వలసిన విధముగ ఈ కార్యమున తోడ్పడుచున్న శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలాధ్యక్షులు డా॥ కె. సేతురామేశ్వర దత్తాగారికి, వెంట వెంటనే ముద్రణమునకు సర్వసంభారములను సమకూర్చుచున్న తి. తి. దే. ప్రెస్ మేనేజరు శ్రీ యమ్. విజయకుమార్ రెడ్డిగారికిని, నా ప్రశంస దప్ప వేరేమీయగలను. నాచేర్పులు కూర్పులన్నింటిని సావధానముగ వీలైనంత నిర్దుష్టముగ ముద్రించుచున్న తి. తి. దే. ప్రెస్ అచ్చుకూర్పరులకు, ఈ పీఠిక వ్రాతలో తగు విధముగ సహకరించిన చిరంజీవి కె. రామచంద్రరాజునకు నామంగళాశాసనములు.

" ఎచ్చటైనను తప్పుండు చెరికైన, ధర్మమే భ్రాంతి పురుషుల ధర్మమగుట " అను తిరుపతి వేంకటకవులమాట ననుసరించి, ఎంత జాగ్రత్తగ పరిశీలించినను మాకనుగప్పి దొరలిన దోషములను సహృదయులు మన్నించి తెల్పినచో పైపై సంపుటములలో మరింత జాగ్రత్తపడగలమని మనవి.

సంగీత సాహిత్యే చాంగీకారాయ శారదా ముద్రామ్ ।
యస్య వీరీక్షత స్వయ మభివందే రాళ్లపల్లికులమందారమ్ ॥

తిరుపతి
27–11–77

బుధవిధేయుడు,
శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ.
(తాళ్లపాక వాఙ్మయ పరిశోధకుడు)
ఆంధ్రశాఖాధ్యక్షుడు,
శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాల.



# సందిగ్ధపదసమీక్ష

[తాళ్లపాకకవులవాఙ్మయములో అపూర్వపదరాశి గొప్పది. దానినిగూర్చి విస్తారముగ పరిశ్రమ సాగవలసియున్నది. దాని కుప-స్కారకముగ నిఘంటువుల కెక్కనివీ, ఎక్కినా అర్థాంతరమున ప్రయోగింపబడినవీ, ఇతర ప్రయోగములందు కానరానివీ, మాత్రమే యీ సమీక్షలో లఘువుగ చర్చింపబడునవి. ఈ చర్చలో నాది సూచనమాత్రమే. పైపై పెద్దలు పరామర్శింపగలరు. ఈ సంపుటమునుండి ఈ సమీక్ష కడపటగాక పీఠికానంతరము చేర్చబడుచున్నది.]

1. ఆఁడుఁబోడి (517 పాట). 'ఆఁడుఁబోఁడిమి' లో సామాసికముగ 'మి' లోపించి యేర్పడిన రూపము కావచ్చు. ఈ పద్ధతి ఈ వాఙ్మయమున అక్కడక్కడ కానవచ్చుచున్నది. చూ:- "మఱి యాఁడుఁబోడెడ్డెడు మగపోడిమా నేఁడు" 22వ సంపుటము 456 పాట. అక్కడ "దీనియర్థము విచార్యము" అని వ్రాసియుంటిని. పరిశీలింపగా 'ఆఁడువారిపద్ధతి, ఆఁడుఁదనము' అని అర్థముగా తోచుచున్నది.

2. ఉంగిటి (149 పాట) ఉంగిడి = 'ఊపిరియాడనిస్థితి' అని వా. ని. ఆ 'ఉఁగిడియే ఉంగిటి' అయి యుండవచ్చు. ఉంగిడికి ఛాయార్థముగా 'మీదమీద' 'యెడతెరపిలేక' 'దండి' ఇత్యాద్యర్థములలో ప్రయోగించినట్లున్నది.

3. ఒలినిలయా (414 పాట) ఒలి = 'శబ్దము' అని తమిళము. అదే మన 'ఉలివు' కావచ్చు. ఒలిశబ్దార్థమునకు ఛాయగా శ్రుతి (వేదము) అని అర్థమైనచో, వేదాధారా అని అర్థము కావచ్చు.

4. కడమదొడమలు = (181 పాట) ఇది జంటపదముగా తోచుచున్నది. ఈ నాటివ్యవహారములో కానవచ్చుటలేదు. 'మిగిలించి,

తగిలింపె', 'వచ్చింది, పోయింది' ఇత్యాద్యర్థములలో వాడినట్లు తోచుచున్నది. 'మిగిలినది' అను నర్థమున కడమశబ్ద మీనాటికిని వ్యవహారములో గలదు.

5. కలుపడఁజేసితి (481 పాట) ఇది నిఘంటువుల కానరాదు. ప్రకరణమునుబట్టి 'నివ్వెరపడునట్లు,' 'భ్రమాన్పడునట్లు,' కలవర పడునట్లు,' చేసితివి ఇత్యాదిగ నూహింపవచ్చు.

6. కొండల మొయిలు మేసినట్లు (559 పాట) కొండల మొయిలు మేయుట అను పలుకుబడి యీనాటికినిగలదు. దండిగ మబ్బులు కొండలపై పారాడు చుండినచో, అదిచూచి గ్రామీణులు 'కొండ మొగిలి మేస్తావుంది వానకు బలమబ్బా' అంటారు. ఆయర్థము-లోనే యీ పలుకుబడి నిచట మాండలికముగ ప్రయోగించి నట్లున్నది.

7. గురుమ (449 పాట) 'కురుమై' Lustre, Brightness, Superiority. అని తమిళము. అదియే ఇది కావచ్చు. 'పెద్దరికము, మహిమ' ఇత్యాది అర్థములుండవచ్చు. ఈ పదప్రయోగము మరియొకచోట చూ:- 517 పాట. 'గరిమ' శబ్దవికారమైన కావచ్చు.

8. గొల్లము జులు (505 పాట) ముంజు = 'పెదుక' అని వా. ని. ఆ అర్థ మిక్కడ సరిపడనట్లు తోచుచున్నది. ప్రకరణమును బట్టి 'ముంజులు=నుచ్చులు' గా తోచుచున్నది. మేకల గొర్రెల-పెంటలు బురదగ తడిపి, దానిని చిన్న పేలికలకు అంటించి, మేకపిల్లలు, గొర్రెపిల్లలు తల్లులదగ్గర పాలు త్రాగకుండుటకై వాటిరొమ్ములకు చుట్టుచుందురు. వాటినే 'నుచ్చు' అని మాండ-లికముగ వ్యవహరింతురు. ఆశబ్దము ఇక్కడ 'అసహ్యము' అను ఛాయార్థమున ప్రయోగించినట్లున్నది.

9. చేపట్టు గుంచమవు (పాట 201) 'చేతికిలోనైవ కొల-పాత్రము' అనునర్థమున వాడినట్లున్నది. 'పరాధీనుడు' చాయార్థము కావచ్చు.

10. చేలాగు (14 పాట) 'చేయూత' అను నర్థమున వాడి-నట్లున్నది. చేయిచ్చి లాగుకొనుటయు కావచ్చు.

1. తిరువుమొరువు (12 పాట) 'తికమక' అనునర్థమున వాడి-నట్లున్నది. ఈ యర్థమున శకటరేఫతో నిజంటపదము తమిళ-నిఘంటువున గలదు.

2, తీసిపెట్టుగానితమిన్ (96 పాట) 'తీయుటకు పెట్టుటకు వలనుపడని, లేదా తొలగించుటకు సాధ్యపడని' అను నర్థమున నీధాతుజవిశేషణములు క్త్వా-తముతోకూర్చి ప్రయోగించి-నట్లున్నది.

13. నిజపట్టేవు (48 పాట) 'భయము + పడు = భయపడువలె, నిజము + పట్టు=నిజపట్టు' వాడినట్లున్నది. ఇది అపురూపమే.

14. నిట్టి పిడిమేఁదాన (పాట 435) నిఘంటువుల కానరాదు. ప్రకరణమునుబట్టి, 'నిలువైనపిడివంటి శరీరముగలదానను' అని తోచుచున్నది. 'సౌందర్యము లేకుండుట' దీ· లో అభివ్యక్త-మగునేమో?

15. బగివాయ కాపెమీఁది పరాకున నున్నవేళ (189 పాట) ఇక్కడ పరాకుశబ్దము, 'పరవశము - మగ్నత' అను నర్థమున సరిపోవుచున్నది. పరాఙ్ముఖ శబ్దభవము గదా ఇది. పై తెల్పిన యర్థములోనే 'విస్మరణంబైనది మాటలపరాకుచే ననుచు కళా 3-81. దీనినే వా. ని కూడ నుదాహరించినది.

16. పేనిపట్టుక (186 పాట) అక్కడక్కడ 'పానిపట్టి' అని కానవచ్చు దానికిదియే మూలరూపమా అనిపించుచున్నది. ఈ 'పానిపట్టి'

'పనిపట్టి' అనుదాని వ్యావహారికరూపము కావచ్చునని, 22వ సంపుటము సందిగ్ధ పదసమీక్షలో 30 వదిగ నిచ్చియున్నాను. పరిశీలించగ 'పేనిపట్టి లేక పూనిపట్టి అనువానివికారముగ తోచుచున్నది.

17. చేసేటి బత్తి (265 పాట) భక్తిశబ్దభవమైనయీబత్తి, ఈ వాఙ్మయములో, స్త్రీ పురుషు లొకరొకరిపై చూపెడి 'ప్రేమ' కు పర్యాయముగ చాలచోట్ల గలదు. పై యర్థములోనే యెక్కువగ నుండుట గమనింపదగినవిషయము.

18. మోమోము (437 పాట) మోము + మోము = మోమోము అని విచిత్రమైన ఆమ్రేడితసంధి. ప్రతివారిముఖము అనియే కాక, ఒకరిముఖము నింకొకరుచూచుట, (మొగము మొగము చూచుకొంటే) అను నర్థముగూడ సరిపోవుచున్నది.

19. లాగవేగాలు (234 పాట) 'లాఘవ' శబ్దభవము 'లాగ' కాగా, 'సులువుగ వేగముగ' అని యీజంటపదముల కర్థము కావచ్చు, వేగమునకు లాఘవము కారణమూ కావచ్చు. అప్పుడు ద్వంద్వము పొసగదు.

20. సంతము (197 పాట) శాంతశబ్దభవముగా తోచుచున్నది. అర్థము అదే. తద్భవించుటలో అన్నమయ్య స్వతంత్రుడు.

21. వెఱంజరో (534 పాట) వెరంజు ధాతువేనా? శకటరేఫము చింత్యము. అర్థానుస్వాగమునుబట్టి పై 'వెరంజు' గనే భావింపనచ్చు.

N. B. కొన్ని శబ్దములకు వివరణము పాదదీపిక (Foot-Note) లోనే ఇచ్చియుండుటచే ఈ సమీక్షలో శబ్దసంఖ్య తగ్గినది. ఇకపై సంపుటములలో గూడ; పాదదీపికనే యీవివరణమున కెక్కువగ నుపయోగించదలంచితిమి.

శ్రీరస్తు

# శ్రీ తాళ్లపాక
# అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు



~~35 వ సంపుటము~~

స్వస్తిశ్రీ జయాభ్యుదయ శాలివాహన శకవరుషంబులు ౧౩౪౬ అగు నేఁటిక్రోధి సంవత్సరమందు తాళ్లపాక అన్నమాచార్యులు అవతరించిన పదారు యేండ్లకు తిరువేంగళనాథుండు ప్రత్యక్షమైతేను అది మొదలుగాను శాలివాహన శకవరుషంబులు ౧౪౨౪ అగు నేఁటి దుందుభిసంవత్సర ఫాల్గుణబహుళ ౧౨ నిరుధానకు[1] తిరువేంగళనాథుని మీఁదను అంకితముగాను తాళ్లపాక అన్నమాచార్యులు విన్నపముచేసిన శృంగార సంకీర్తనలు.

రేకు 901 దేసాళం

అందకు రావయ్యా అన్నియుఁ దెలిసెను
నిండి నొసలిలత్తుక నీరువలె నున్నది ॥ పల్లవి ॥

ముసుఁగు వెట్టుకొని మూల నేమిసేసేవు
నుసరానఁ బెదవులు చూపవయ్యా
యెసఁగి రెప్పలమీఁది కేలవచ్చెఁ దమ్మలము
కొసరితేను చెక్కిట గోరువలె నున్నది ॥ అంద ॥

---

(1) ఈశబ్దము 'నిరోధ' 'నిరుద్ధ' శబ్దములకు వ్యావహారిక రూపముగా కానవచ్చుచున్నది. అడ్డగింపు, అవధి అని యర్థము. ఆనాడు కడపటిదినమని తాత్పర్యము. కీ॥ శే॥ ప్రభాకరశాస్త్రిగారూహించిన 'సరియగు' అను నర్థము తాత్పర్యార్థము కావచ్చును. 'అవధి' అను నర్థములో, "ఈ నిరుద్ధమునకుఁ గుశలంబు మాకు" అను తరిగొండ–వెంగమాంబగారి ప్రయోగము 'విష్ణుపారిజాతము' 55 వ పుట–సాహిత్య అకాడమీవారిది దీనికి సహాయపడుచున్నది. నేనీప్రయోగ మివ్వగా శ్రీమాఁ-రాళ్ళపల్లి–అనంతకృష్ణశర్మగారు, 'నిఱుత్తం' అను అరవపదము గూడ 'నిలుపు' అను నర్థముతో దీనికి సహాయపడు ననిరి.

క్రీగీతగల స్థలము చిమ్మట దినుటచే దుంక పడియున్నది.

కాయమెల్లాఁ గప్పుకొని కడులోన నున్నాఁడవు
సోయగపునీవురము చూపవయ్యా
చాయలకెంపు లెడవిసరీ బాహుమూలముల
నీయందుఁ గళలు నేఁడు నెలకొన్నట్లున్నవి ॥ అంద ॥

తెరవేసు కేలితి వొద్దిక నలమేల్మంగను
సొరిది నీనెమ్మొగము చూపవయ్యా
ఇరవై నన్ను శ్రీవేంకటేశుఁడ యేలితివి
వెరవుతో నీపుక్కిట విడె మున్నట్లున్నది ॥ అంద ॥ 1

మాళవి

ఇయ్యకొంటి నిఁక నీయిచ్చాయను
కొయ్యతనాలదాననా కొసరితిఁ గాక ॥ పల్లవి ॥

యెనయక నీతోసు యెదురాడేదాననా
అనవల శొకమాట ఆడితిఁ గాక
పెనఁగుచు నీతోను బిగిసేటిదాననా
చనవుమెఱసి కొంతజంకించితిఁ గాక ॥ ఇయ్య ॥

యెదచొచ్చి నీపట్టుకు నెగసక్కెపుదాననా
నడుమ నూరకే నీతో నవ్వితిఁ గాక
జడిగొని నిన్నుమీరి సాదించేదాననా
పుడివోసిచన్నుల నొత్తితిఁ గాక ॥ ఇయ్య ॥

సొరిది గబ్బితనము చూపేటిదాననా
కెరలి కాఁగిటను బిగించితిఁ గాక
యిరవై శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
జరగేదాననా మోవి చవిగొంటిఁ గాక ॥ ఇయ్య ॥ 2

సాళంగనాట

తొలుత నలుఁగవా తొయ్యలిలాగు
బలిమి చూపఁగనేల పంతమియ్యనేల ॥ పల్లవి ॥

వాడిపట్టి తీసి నీవు వాడఁబరచఁగ నిపె
కొాడిమెలు నిన్ను నెంచి కొాసరీనాపె
అడరి యప్పటి నీవు అవుఁగాము లాడుకోఁగా
బెడిదపుఁబెదవులు పిప్పిగట్టీ నిదివో ॥ తొలు ॥

కక్కసించి పెనఁగుచు కాఁగిలించి వేఁడుకోఁగా
చక్కఁ గిందవేసుకొని జరసీ నాపె
వెక్కసమై నీ వందుకు వినయాలు సేయఁగాను
పక్కన నీసేఁతలెల్లాఁ బచ్చిదేరీ నిదివో ॥ తొలు ॥

శ్రీ వేంకటేశుఁడ యిట్టె చేరి నీవు గూడఁగాను
భావించి నీవురముపై నెక్కి నాపె
వేవేగ నిప్పుడే నీవు విడెము చేతి కియ్యఁగా
చేవదేరి నీవలపు చిమ్మిరేఁగె నిదివో ॥ తొలు ॥ 3

దేవగాంధారి

దేవరగుణములు దెలియవు
నీవే మాకును నేరుపవయ్యా ॥ పలవి ॥

వదలక నీతో వాసికిఁ బెనఁగిన
యెదుటనె నీమన సెట్టుండునో
కదిసి నీరతికిఁ గడుదమకించిన
యిది వేసాలని యెంతువో నీవు ॥ దేవ ।

చెనకఁగ నీయెడ సిగ్గులు నెరపిన
పనులవి యేమని భావింతువో
ననిచి నీయెదుట నవ్వులు నవ్విన
తనివిలేనిదని తగ నాడుదువో ॥ దేవ ॥

కూడుచు నిన్నిటు గుబ్బల నొత్తిన
వోడ దనుచు గో రూఁదుదువో
యీడనె శ్రీవేంకటేశ యేలితివి
వీడె మిచ్చితే వెరగందుదువో ॥ దేవ ॥ 4

కన్నడగౌళ

సేసతోఁ బెండ్లాడితివి చెల్లుబడి కాకపోదు
గాసిఁ బెట్ట కిట్టె నన్నుఁ గరుణించరాదా ॥ పల్లవి ॥

చెన్నుమీర చిత్తము రా సేవలు సేయకుండితే
నన్ను నీవప్పుడు మరి నగరాదా
వన్నెల నిన్నిట్టె కైవసము సేసుకుంటే
మిన్నక నీ పంతములు మెరయరాదా ॥ సేస ॥

ఆయము లంటుచు నిన్ను నాసకొలుపకుండితే
పాయపుమదాన నన్నే పలుకరాదా
చాయల నే నీమోవి చవులుగొనకుండితే
సోయగపుబి(వి?)న్నాణానఁ జూడఁగరాదా ॥ సేస ॥

చేపమీరినరతుల సిగ్గులు రేఁచకుండితే
నీవాసు లిన్నియును నెరపరాదా
శ్రీవేంకటేశ్వర యిట్టె చేకొని కూడితివి
యీ వేడుకలు గలిగె నిఁక మెచ్చరాదా ॥ సేస ॥ 5

మంగళకౌశిక

ఎటువంటివాఁడవయ్యా యిచ్చకము సేయఁగాను
సటలంటా బొమ్మలను జంకింతురా ॥ పల్లవి ॥

వూరకే నీపాదములు వొత్తుచుఁ బిసుకఁగాను
గోరుదాఁకెనంటా యేల కొచ్చి చూచేవు
చేరిపూడిగాలు గడుఁ జేసితే మెచ్చుఁగాక
నేరుపు నేరము లెంచి నిందవేతురా ॥ ఎటు ॥

కన్నగన్నచోటనెల్లా గందము నీకుఁ బూయఁగా
చన్నులు నాటెనంటా సాదించేవు
వున్నతి బత్తిసేసితే నొడఁబడుదురుగాక
సన్నలఁ దప్పులుమోపి చండిసేతురా ॥ ఎటు ॥

మొల్లమిరతుల నిన్ను మోవి యాని కూడఁగాను
పల్లు సోఁకెనంటా నాతోఁ బంతమాడేవు
యిల్లిదె శ్రీవేంకటేశ ఇందుకె నవ్వుటగాక
కొల్లగా సిగ్గువరచి కొసరుదురా ॥ ఎటు ॥ 6

రేకు 902 దేశాక్షి

ఏమనేమయ్య నీవు యేలికవు మాకునెల్లా
ఆమనిగా మోవి చూపి యాసరేఁచేవు ॥ పల్లవి ॥

ఇచ్చకములే సేసి యెలయించి యెలయించి
పచ్చిదేర నింతులను భ్రమయించేవు
ముచ్చటలాడి కడుమోహములు పైఁజల్లి
మెచ్చులుగా వలపించి మేకులుసేసేవు ॥ ఏమ ॥

---

భ్రాగీతగలది చివుము దివి దుంకపడిన స్థలము.

సందడిఁ జేతులు చాఁచి జవ్వనము లంటియంటి
మందపెండ్లికూఁతులను మరిగించేవు
విందులపీడెము లిచ్చి వేసాలు. గమునెరపి
యిందులోనే యేకతాన యెమ్మెల మించేవు ॥ ఏమ ॥

నమ్మిక లెన్నైనా నిచ్చి నగవులు పచరించి
మమ్ము నిందరినిఁ గూడి మన్నించేవు
నెమ్మది శ్రీవేంకటేశ నేరుపులు పచరించి
నిమ్మపండు చేతికిచ్చి నీటులు చూపేవు ॥ ఏమ ॥ 7

తెలుఁగుఁగాంబోది

దయఁజూడవయా తతిగొని మొక్కేము
ప్రియురాండ్లము నిమఁ బెండ్లాడితిమి ॥ పల్లవి ॥

చలములు నీతో సాదించేమా
వలచినవారము వనితలము
బలుములు నీతోఁ బచరించేమా
కొలిచినవారము గొల్లలము ॥ దయఁ ॥

పెనఁగుచు నీతో బిగినేమా నీ-
నునుపులవారము నాతులము
పనివడి నేరమి పైవేసేమా
చనవరివారము సాదులము ॥ దయఁ ॥

యీవేళఁ గూడితి మెలయించేమా
దేవుళ్లము నీతెఱవలము
శ్రీవేంకటేశ్వర చెలఁగి నగేమా
బావపువారము భోగులము ॥ దయఁ ॥ 8

## శుద్ధవసంతం

జంకించితనేవు నన్ను సాదవా నీవు
సంకించ వేమిటికి సాదవా నీవు ॥పల్లవి॥

దూరి కోపకత్తెనంటా తొయ్యలుల కందరికి
సారె సారెఁ జెప్పేవు సాదవా నీవు
వూరకే మాటలాడుతా నొద్దఁ గూచుండి నా కిట్టె
సారపుబుద్ధి చెప్పేవు సాదవా నీవు ॥జంకిం॥

గారబుగా నావలపు కొల్లున నవ్వుతా నీవు
సరవితోఁ గేరేవు సాదవా నీవు
తెరవేసి యానవెట్టి దిమ్మరిసేఁతలు చేసి
సరుగఁ జెక్కునొక్కేవు సాదవా నీవు ॥జంకిం॥

కలికినాకుచములు కాఁగిటను బిగియించి
చలపట్టి కూడితివి సాదవా నీవు
అలరి శ్రీవేంకటేశ అదరపుతేనె లిచ్చి
చలివాసితివి సిగ్గు సాదవా నీవు ॥జంకిం॥ 9

## కేదారగౌళ

వింటిమి యీకొత్తలు వీనులు చల్లఁగాను
జంటలై నీపై వలపు చల్లైనట చెలియ ॥పల్లవి॥

వేడుకలు వెదచల్లి వీడెము పుక్కిటఁ బెట్టి
ఆడరానిమాట లాపె ఆడెనట
కోడెకాఁడవై నీవు కొండగొడ(డు?) గత్తఁగాను
నీడనుండే చెమటలు నించెనట చెలియ ॥వింటి॥

చిప్పిల నవ్వులు నవ్వి చేతులు బుజాల వేసి
చెప్పరానిసేఁత లాపె చేసెనట
గొప్పలుగా నీవు పిల్లఁగోవి రాగా లొత్తఁగాను
దెప్పరాన నలపెల్లాఁ దేరెనట చెలియ ॥వింటి॥

చాయలు సన్నలు చూపి చన్ను లురమున నాని
సేయరానిసేవ లాపె చేకొనెనట
యీయెడ శ్రీవేంకటేశ ఇటు నన్నుఁగూడితివి
మోయరానిచోటు మోపి మొక్కెనట చెలియ ॥వింటి॥ 10

ఆహిరి

ఎప్పుడు మన్నించేవయ్య ఇఁక నీవు
వుప్పతిల్లువేడుకెల్లా వొడిఁగట్టుకొన్నది ॥పల్లవి॥

జవ్వనమదముతోడ చన్నులవేఁకముతోడ
నివ్వెరగుపడి చెలి నిలుచున్నది
నవ్వులు సెలవిఁగార నయము మోమున మీర
వువ్విళ్లూరుచు నీపై నొరగుకొనున్నది ॥ఎప్పు॥

సిగ్గులనే విఱ్ఱవీఁగి చిప్పిలఁగ మోవి మాఁగి
వొగ్గి విడె మందుకొని వూరకున్నది
నిగ్గుఁబులక లెసఁగ నిట్టూర్పులు వొసఁగ
కగ్గుదేర నేకతానఁ గాఁగిలించుకొన్నది ॥ఎప్పు॥

పెనుఁగొప్పు కడువీడ ప్రియాలు మాటలఁగూడ
గునియుచు నీతొడపైఁ గూచున్నది
యెనసితివి శ్రీవేంకటేశ యీకెనుమన్నించి
ననుపుల నిన్ను నిట్టె నమ్మివున్నది ॥ఎప్పు॥ 11

సాళంగం

ఏమయ్య యింతయేల యెకసక్కెలు
సాము సేసిననీతో సతి పెనఁగీనా ॥ పల్లవి ॥

ఎలచనినగవులపగిడికాఁడవు
వెలలేనివేడుకలవేసదారివి
మలకలపలుకులమతకరివాఁడవు
కలికి నీకు నేఁడు కత చెప్పఁగలదా ॥ ఏమ ॥

తిరువు మురువు సేసేదిమ్మరీఁడవు
పరిగుపెక్కువిద్యలబయకాఁడవు
అరుదైనజూదాలఆగడీఁడవు
గరిమ నీకు నింతి కత చెప్పఁగలదా ॥ ఏమ ॥

సంతకూటముల జాణకాఁడవు
మంతనపురతులమాసటీఁడవు
చెంతఁ గలసితివి శ్రీవేంకటేశ్వర
కాంత నీకు నిట్టె కత చెప్పఁగలదా ॥ ఏమ ॥ 12

రేకు 903 లలిత

[1] కానీవే గొల్లెతా గబ్బిగొల్లెతా
ఆనుక తెలుసుకొంటి వవునవురా గొల్లఁడా ॥ పల్లవి ॥

పంతకారిగొల్లెతా పదరకు గొల్లెతా
రంతుల నట్టేకానీరా గొల్లఁడా
యింతగట్టు(ట్టి?)వాయవౌత యెరిఁగితినే నేను
సంతలోనె వింటిరా నీసాదుఁదనాలెల్లను ॥ కానీ ॥

1. ఇది వాకోవాక్యము.

మతకారిగొల్లెతా మంకులాఁడిగొల్లెతా
రతులకు మాయింటికి రారా గొల్లఁడా
కతకారివౌత ఇట్టె గానవచ్చెనే నేఁడు
చతురతలు మోమున జడిసేరా నీకును ॥ కానీ ॥

చనవరిగొల్లెతా చనవిమ్మా గొల్లెతా
కెలయకు శ్రీ వేంకటగిరిగొల్లఁడా
పొలఁతు లందరు నేఁడు పొగడేరే నిన్నును
కలపితి వౌఁ నిన్ను కమ్మటి మెచ్చితిని ॥ కానీ ॥ 13

హిజ్జిజి

విన వేడుకయ్యీ మాకు వింతలైనమీసుద్దులు
యెనలేనిముచ్చటలు యెటువంటివో ॥ పల్లవి ॥

యెంగిలిపెదవి వంచి ఇందాఁకా నీచేతిలోన-
నంగవించి మాటలాడె నది యెవ్వతో
పొంగుచు నీమేన నిట్టె పులకలు గడునిండె
సంగతి న వెటువంటిసంతోసములో ॥ విన ॥

చెమటచన్నులు దాఁక చేలాగు నీకు నిచ్చి
అమర లోనికిఁ దెచ్చె నది యెవ్వతో
తమితోఁ గళలు రేఁగి తతి నివ్వెరగైతివి
సమమైన వెటువంటిసంగడిపొందులో ॥ విన ॥

జవ్వనమదము గార సదమదముగ నిన్ను
అవ్వలఁ గాఁగిటఁ గూడె నది యెవ్వతో
ఇవ్వల శ్రీవేంకటేశ ఇటు నన్ను నేలితివి
వువ్విళ్లూర నెటువంటి వుపాయములో ॥ విన ॥ 14

వరాళి

ఏఁటికి సత్యాలు సేసే వెందాఁకా నీవు
గాఁటముగ నింకాఁ దారుకాణించవలెనా ॥పల్లవి॥

చెలియిచ్చినపువ్వులచెండు నీచేత నున్నది
మలసి నీచేఁత కది మచ్చము గాదా
కొలఁదిమీరఁగ తొల్లె గొల్లెతల మగఁడవు
యెలమి నీయెడ్డతనా లెంచిచూపవలెనా ॥ఏఁటి॥

రమణిచేముద్దుటుంగరము నీవేల నున్నది
కొమరై నీపొందు కది గురుతుగాదా
తమితోడ నీవు తొల్లె ధర్మరాజు మఱఁదివి
గములై నీ నిజాలకు కడగుచు తున్నదా ॥ఏఁటి

అంగనకంటసరి నేఁడట్టె మెడ నున్నది
సంగతిగా నీకదె లాంచనము గాదా
చెంగట నన్నేలితివి శ్రీ వేంకటేశ్వర
అంగపునీరతులకు నొఁగాము లున్నవా ॥ఏఁటి॥ 15

శ్రీరాగం

అంతలోనె తేరెనా ఆకెమనసు
పొంతనుండి యింకానేమి బుజ్జగించేవయ్యా ॥పల్లవి॥

నెలవి నవ్వులతోడ చెలియ మాటాడఁగాను
వెలయఁ బూబంతిఁ గొని వేసితివి
నిలువుఁదురుము దాఁకె నిన్ను నాకె చూడఁగాను
చెలరేఁగి యేమిటికిఁ జెక్కు నొక్కేవయ్యా ॥అంత॥

కొసరుఁజూపులతోడ కోమలి నీకు మొక్కఁగా
పొసఁగఁ బన్నీరు దిగఁబోసితివి
వెసఁ బయ్యెద దడిసి వేసుక యానవెట్టఁగా
విసువక ఇప్పుడేమి విడెమిచ్చేవయ్యా ॥అంత॥

సిగ్గులచేఁతలతోడ చెలి కాఁగిలించుకోఁగా
వొగ్గి గందవొడి చల్లి వొనరితివి
నిగ్గుల శ్రీవేంకటేశ నిన్ను నాకె మెచ్చఁగాను
అగ్గమై యప్పటి నెంత ఆససేసేవయ్యా ॥అంత॥ 16

ముఖారి

నీవలెనఁ గొసరఁగ నేరుతుమా
సేవలు చేసి నిన్నుఁ జేకొందుఁ గాక ॥పల్లవి॥

వెలలేనివలపులవేడుకకాఁడవు
చలమరిచేఁతలజాజరకాఁడవు
పలుకులఁ గరిగించేబయకారివాఁడవు
నిలువుఁజక్కఁదనాలనీటుకాఁడవు ॥నీవ॥

తచ్చనతరితీపులతగవరివాఁడవు
[1]పచ్చలాయకట్టెలాబపువాఁడవు
లచ్చిగొండితనములలాగవేగకాఁడవు
విచ్చనవిడి తగులువిరికాఁడవు ॥నీవ॥

చొప్పులెత్తి సోదించేసుంకరివాఁడవు
కుప్పళించి పొందుసేసేకోడెకాఁడవు
ఇప్పుడె శ్రీవేంకటేశ యేలితివి నన్ను నిట్టె
తొప్పఁదోగేరతులకు దొమ్మికాఁడవు ॥నీవ॥ 17

1. పచ్చలు + ఆయకట్టె. పచ్చలు = వాణ్యములు (రూకలు). ఆయకట్టు = ఆదాయము వచ్చునట్లుసాగుచేయు (పండించు).

శంకరాభరణం

అలివేణిని( బెండ్లాడవయా
చెలులవిన్నపము చేకొనవయ్యా ॥ పల్లవి ॥

సొలపుల( దొలితొలి చూచినచూపులు
కొల(దిమీర నుంకువలాయ
చెల(గి చేతులను సేసినసన్నలు
తల(ప(గ నలుగడ( దల(బాలాయ ॥ అలి ॥

ననుపున సెలవుల నవ్వివనవ్వులు
గొనకొన(గ( బాలకూళ్ళాయ
అనువుగ ప్రియమున నాడినమాటలు
మనసిజతంత్రపుమంత్రములాయ ॥ అలి ॥

వేడుక కా(గిటివినయపు సే(తలు
కూడినకూటపుగురులాయ
ఝూడనె శ్రీ వేంకటేశ యేలితివి
తోడలమేల్మంగ దోమట్లాయ ॥ అలి ॥ 18

రేకు 904 వేళావళి

ఏమిటికి( ఒలము యెందా(కా
నాములతోడుత నగవే యి(కను ॥ పల వి ॥

బలుము లేమిటికి( బచరించేవే
వలచినదానవు వనితవు
సొలయచు రమణుని సోదింతురటే
అలరి ఇచ్చకములాడుట గాక ।ఏమి ॥

తగవులఁ బెట్టఁగ తగునటవే యిఁక
మగనితోఁడ పలుమరు నిపుడు
అగడుసేతురా ఆతని నింతేసి
చిగురుమోవి పాసఁగి చెలఁగుటగాక ఏమి ॥

కూడినవేళను గుట్టుసేతురా
యీడనె శ్రీ వేంకటేశునెడ
ఆడకు పంగెము లలమేల్మంగవు
వీడెము లందుక వెలయుటగాక ॥ ఏమి ॥ 19

రామక్రియ

అవునయ్య నీసుద్దు లటువంటివి
చవళితో నంటుబచ్చలివంటివాఁడవు ॥ పల్లవి ॥

చెలరేఁగి యేడలేని చేఁతలెల్లాఁ జేసివచ్చి
వెలయ నిప్పుడు నన్ను వేఁడుకొనేవు
పలుమారు నీచేత బాసలుగొన వెరతు
కలువకంటులయెడ కాతరీఁడ వనుచు ॥ అవు ॥

వాడవారిపైనెల్లా వలపులు చల్లి వచ్చి
యీడ నాతో నేడలేని యిచ్చలాడేవు
కోడెకాఁడ నీవొట్టు కొనియాడ సిబ్బితయ్యీ
జాడతో నింతులయెడ చంచలుఁడ వనుచు ॥ అవు ॥

పెక్కుగోపికలనెల్లాఁ బెండ్లాడి యిట వచ్చి
గక్కన నాతోఁగిటఁ గలసితివి
నిక్కి శ్రీ వేంకటేశుఁడ నే నలమేల్మంగను
తక్కులించ నోప పెక్కు గబ్బివాఁడ వనుచు ॥ అవు ॥ 20

గౌళ

చెలులాల చూడరే చెలువునిబాగులెల్లా
నిలువుఁజక్కఁదనాల నిలుచున్నాఁ డీడను ॥ పల్లవి ॥

ఇయ్యఁగదే విడెము యిందాఁకా నేడ నుండెనే
నెయ్యపురమణుఁడంటా నే నుంటిని
పయ్య దంటవచ్చీని పలుమారు నన్నుఁ జూచి
కొయ్యతనాలు నేరిచె గొంకఁ దేమిటికిని ॥ చెలు ॥

అడుగవే సుద్దులు ఆడ నుండి తా వచ్చె
నడుమఁ దనప్రియాలు నమ్మితిని
వొడివట్టి పెనఁగీని వొనరి సంతోసాన
గడుసాయఁ జేఁతలను కరఁగఁ డెంతయినా ॥ చెలు ॥

మొక్కవే నామారు ముంచి నన్నిటు గూడె
యిక్కడ శ్రీ వేంకటేశు కిరవైతిని
అక్కరతో మన్నించీని అలమేలుమంగ నేను
తక్కక రతుల మించీ దంట తనమునను ॥ చెలు ॥ 21

దేసాళం

ఇందరు నెఱిఁగినవే యీసుద్దులు
యెందాఁకా వట్టిమాయ లేమిసేసే నిపుడు ॥ పల్లవి ॥

తప్పులుదారులు నన్ని తానె తేరీఁగాని
చెప్పరాదా నీమాట చేరి వినేను
అప్పట నుండియు నీపు అఇత్తపడే విట్టె
నెప్పున నీనిజములు నెరపేవు సారెకు ॥ ఇంద ॥

ఈ క్రీగీతలుగల స్థలములు చిలుమెక్కువగ నున్నది. కొన్నియక్షరము లరిగి యున్నవి.

తీపులఁ గారాలు నిట్టె తేటతెల్లమయ్యీఁ గాని
చూపరాదా నీమోవి చూచే నేను
పైపైనే మలసేవు పంతగారితనమున
వోపికఁ జెలుల నేమి నొడఁబరచేవు ॥ ఇంద ॥

పాడియునుఁ బంతమును బాయిటఁబడీఁ గాని
కూడరాదా నీవు నన్నుఁ గోరి మెచ్చేను
వేడుక నేలితివి శ్రీ వేంకటేశ ఇంతలోనే
యీడ నే నలమేల్మంగను ఇంపు నాకుఁ జేసేవు ॥ ఇంద ॥ 22

పాడి

బొంకనితప్పనియట్టి పురుషుఁడవు
మంకుదీర నీవెట్లా మాటలాడేవయ్యా ॥ పల్లవి ॥

ననవుచేసుక ఇంతి సారె సారె సొలయఁగా
ననుపుచేసుక నీవు నవ్వఁగాను
మొనసి సవతులెల్లా మోములు చూచుకొనేరు
పొనుగక వారినెట్టు బుజ్జగించేవయ్యా ॥ బొంక ॥

ప్రియము గూరిచి యాపె బెట్టియాన వెట్టఁగాను
క్రియగూడ నీవు నట్టె కెలయఁగాను
కయివుగాఁ దోడివారు [illegible]పసన్నలఁ జూపేరు
నయమున వారి నెట్టు నమ్మించేవయ్యా ॥ బొంక ॥

మక్కువ నిన్నలమేలుమంగ గాఁగిలించఁగాను
నిక్కి శ్రీవేంకటేశుఁడ నీవు మెచ్చఁగా
తక్కిన సవతులెల్లా[1] నాసగించేరు
ఒక్కరితో వారినెట్టు ఆదరించేవయ్యా ॥ బొంక ॥ 23

1 [illegible]ంచు' సహజము. 'మోసగించు' వలెనా?
[illegible]

మధ్యమావతి

ఎటువంటివలపో యెవ్వరికోలఁది గాదు
ఘటనతోఁ దమకించీఁ గనుఁగొనవయ్యా ॥ పల్లవి ॥

తళుకున నిన్నుఁ జూచి తలవంచుకొని యింతి
తలపోసీ నీరూపు తనలోననె
నిలువుఁజెమటతోడ నిట్టూరుపులతోడ
చెలరేఁగి గుబ్బతిలీఁ జిత్తగించవయ్యా ॥ ఎటు ॥

కోరి నీపై నాసపడి గొబ్బునను సిగ్గువడి
పేరఁబెట్టి మాటలాడీఁ బెదవులనె
సారపుతుమకముతోడ జవ్వనభారముతోడ
ఆరీతి నివ్వెరగందీ నాదరించవయ్యా ॥ ఎటు ॥

కాఁగిటికిఁ జెయ్యి చాఁచి కన్నులనే నీకు మొక్కి
మాఁగినమోవి యిచ్చీ మతకాననె
చేఁగదేర నిన్నుఁ గూడె శ్రీవేంకటేశుఁడ
వీఁగ దలమేలుమంగ వినోదించవయ్యా ॥ ఎటు ॥ 24

రేకు 905 భల్లాటి

ఏమిటికి మాముందర యెమ్మెలెల్లాఁ జూపేవు
నేమూ నీవలె మేలు నెరపఁగఁగలమే ॥ పల్లవి ॥

చక్కనిదాన వౌదువే సణఁగులాఁడి వౌదువే
నిక్కి విభునిఁ గొసర నేరుతువే
దక్కనే నీపంతములు తరుణులలోనెల్లా
మక్కువ నాతని నింత మరిగించుకొంటివి ॥ ఏమి ॥

శ్రీగీతలుగల స్థలముల చిలుమెక్కువగ నున్నది.

నవ్వని వొదుపే నుంచి జాణతనత్తై వొదువే
రవ్వసేసి భ్రమయించ రాజవే నీవు
నవ్వు లిదేరెనే నీకు నడుమ నిందరిలోన
బువ్వాన సీతని నింత పొందుసేసుకొంటివి ॥ ఏమి ॥

మేటి వొదుపే అలమేలుమంగ వొదువే
పాటించి శ్రీ వేంకటేశుఁ బనిగొంటివి
మాటలు చెల్లె నీకు మావంటివారిలోనెల్లా
చాటువ మమ్మేలితని చనవు గైకొంటివి ॥ ఏమి ॥ 25

## పాడి

ఎంతైనా నాతఁడు నీకు నెక్కుడుగాదా
కాంతుఁడు మన్నించఁగానే [1] ఘనురాల వైతివి ॥ పల్లవి ॥

వెక్కసములాడకువే విభునితో సారె సారె
మిక్కిలి నాతఁడు నీకు మేలువాఁడు
డక్కపపిట్టలవంటిచన్నులు విసికెనంటా
వుక్కవంటి గోరనేల వూఁదేవే నీవు ॥ ఎంతై ॥

అరితేరి యెంచకువే అందనుండి ఇంతలోనె
చేరి నీకుఁ బ్రియములు చెప్పీ నాతఁడు
తోరపుమొయిలువంటితురు మాతఁ డంటెనంటా
బీరానఁ జేతులు చాఁచి పెనఁగుదురటవే ॥ ఎంతై ॥

నీ వలమేలుమంగవు నిందలు వేయకువే
శ్రీ వేంకటేశుఁడు నిన్నుఁ జెందినవాఁడు
ఆవటించి నిన్నుఁగూడి యట్టె చెక్కంటెనంటా
కావరించి నీ వప్పటి ఘాత సేయఁదగునా ॥ ఎంతై ॥ 26

1. 'ఘనురాలు' వింతప్రయోగము.

శుద్ధవసంతం

సూటిగా నన్నేమి చూచేవు
నీటుతోడ నన్నీ నేరుపవయ్యా ॥ పలవి ॥

నవ్వుతా నిన్ను నాయము అడిగి—
నెవ్వతో ఆనతి యియ్యవయ్యా
జవ్వని యప్పటి సరిజేసుకాడీ
వువ్విళ్లూరఁ బందె లొగి వేయవయ్యా ॥ సూటి ॥

మచ్చికతోడుత మనవి చెప్పి
విచ్చనవిడిని వినవయ్యా
వచ్చి యాపె నీతో వసంతమాడీ
పచ్చివలపులు పైఁ జల్లవయ్యా ॥ సూటి ॥

పలుమరు నీపైఁ బాటలు వాడీ
మెలుపున నిట్టె మెచ్చవయ్యా
అలమేలుమంగనై ననన్నేలితి—
వెలమి శ్రీ వేంకటేశ నేఁడయ్యా ॥ సూటి ॥ 27

దేవగాంధారి

మిక్కిలి మేలుది అలమేలుమంగ
అక్కరతో నిన్నుఁజూచీ నలమేలుమంగ ॥ పలవి ॥

కొచ్చి కొచ్చి యాశా(లా?)పించి కూరిమితోఁబాడఁగాను
మెచ్చీ నిన్ను నిదె యలమేలుమంగ
నెచ్చెలులతోడనెల్లా నీసుణాలు సారెసారె
అచ్చలాన నాడుకొనీ నలమేలుమంగ ॥ మిక్కి ॥

వాడలవాడల నీవు వయ్యాళిఁ దోలఁగాను
మేడలెక్కి చూచీ నలమేలుమంగ
పీడెము చేతఁబట్టుక వెన నీవు పిలువఁగా
ఆడనుండి వచ్చె నీడ కలమేలుమంగ ॥ మిక్కి ॥

యాలీల శ్రీ వేంకటేశ ఇంతచన వియ్యఁగాను
మేలములాడీ నలమేలుమంగ
యేలినసీరతులను ఇదె తననేరుపెల్లా
ఆలోచనలు నేసీ నలమేలుమంగా ॥ మిక్కి ॥ 28

శ్రీరాగం

ఎట్టు దరించఁగవచ్చు నిల్లాండ్లకు నూరిలోన
చుట్టమవై సిగ్గులెల్లా చూరలాదేవు ॥ పల్లవి ॥

మాయదారిమాట లాడి మనసులు మరిగించి
పాయపుగొల్లెతలను భ్రమయించేవు
చాయలుసన్నలుఁ జేసి చవులుగా మోవిచూపి
ఆయములు గరఁగించి ఆసరేఁచేవు ॥ ఎట్టు ॥

నెలవుల నవ్వునవ్వి చిట్టంటుచేఁతలు నేసి
కలికిజవరాండ్లఁ గాఁకరేఁచేవు
ప్రియముల నవ్వునవ్వి పెంపుగఁ గాఁకలపుంచి
నయగారితనమున నమ్మించేవు ॥ ఎట్టు ॥

కన్నులఁ దప్పక చూచి కాఁగిటను బిగియించి
కన్నెలనుఁ జొక్కించి కైకొనేవు
అన్నిటా శ్రీవేంకటేశ అలమేలుమంగను నేసు
మన్నించి నన్ను నేలి మంతనమాడేవు ॥ ఎట్టు

రామక్రియ

వట్టిబాఁతిపడి నీపై వలపులు చల్లేముగాక
 యిట్టయితే మరియిఁక నేమిచెప్పేదయ్యా ॥ పల్లవి ॥

కాంతను నాయెుటనె కాఁగిలించుకొంటివి
 పంతములాడఁగ నీకఁ బనియేది
వింతలుగా సిగ్గులెల్లా విడిచినమీఁదట
 యెంతకొసరినా నందు నేమిగలదయ్యా ॥ వట్టి ॥

నావద్దనుండి యాకెతో నవ్వులు నవ్వితివి
 భావించి చూచిన నీకఁ బనియేది
వేవేలకు మతిలోనివెరపు దీరినమీఁద
 చేవమీరినసుద్దులు చెప్పఁ జోటేదయ్యా ॥ వట్టి ॥

చలివాసి యాకెతోనే సరసములాడితివి
 పలుమారుఁ బచ్చిసేయఁ బనియేది
అలమేల్మంగనైన నన్నట్టె యేలితివి
 యెలమి శ్రీవేంకటేశ యెట్టు మెచ్చేదయ్యా ॥ వట్టి ॥ 30

రేకు 906 మనోహరి

అలమేలుమంగవు నీ వన్నిటా నేరుపరివి
 చలములేఁటికి నిఁక సమ్మతించవే ॥ పల్లవి ॥

విడియము చేతికిచ్చి విభుఁడు వేడుకపడి
 వాడివట్టి పెనఁగగా నొద్దనకువే
వుడివోని వేడుకతో నుంగరము చేతికిచ్చి
 యెడయ ; వేఁడుకొనఁగా నియ్యకొనవే



చిప్పిలవలపుతోడ చెక్కులు నొక్కుచు మోవిఁ-
గప్పుర మందియ్యఁగాను కాదనకువే
కొప్పు దువ్వి బుజ్జగించి కొసరి మాటలాడి
అప్పసము నవ్వఁగాను అట్టె కానిమ్మనవే ॥ ౘౘ ॥

యిచ్చగించి శ్రీ వేంకటేశ్వరుఁడు నిన్నుఁ గూడి
మచ్చికఁ గాఁగిలించఁగాను మారాడకువే
పచ్చడము మీఁదఁ గప్పి పట్టపుదేవులఁ జేసి
విచ్చలాన నేలుకొనె నీవూఁ గైకొనవే ॥ అల ॥ 31

కురంజి

ంతకాకు గలదా యేమోయి చెలులను
చెంతల మందెమేళాలు సేసుకొంటి విట్లా ॥ పల్లవి ॥

యేకతాన నీవు నాకు నిట్టె కతలు చెప్పఁగా
దాకొని సతులెల్లాను తామూ వినేరు
జోకతో నీవు విడేలు సొరిది నా కందియ్యఁగా
చేకొని తామూ నట్టె చేతులు చాఁచేరు ॥ ఇంత ॥

సరసమాడుచు నా చన్నులు నీవంటఁగాను
సొరిదిఁ దమచన్నులు చూపేరు నీకు
తెరలో నాకు నీ మోవితేనె విందువెట్టఁగాను
గరిమఁ దామును నట్టె కడునోరూరేరు ॥ ఇంత ॥

పలుమారు నీవు నాకుఁ బచ్చడము గప్పఁగాను
కలికికాంతలు తమ్మూఁ గప్పుమనేరు
అలమేల్మంగనైన న్నట్టె నీవు కూడితేసు
నెలవై శ్రీవేంకటేశ నిన్నుఁ దామూ కూడేరు ॥ ఇంత ॥ 32

దేసాళం

కొలుపులోపలనున్న కొమ్మలెల్లా నవ్వేరు
కొలఁదిమీరకువయ్యా గోవిందరాజా ॥ పల్లవి ॥

పాపముతో త్తేయట్టిపడఁతికి నిదివో
ఆదిగొని చెమరించె నంగమెల్లాను
కాదనక పచ్చడము గప్పి మఱఁగునసె
పోదితో నాపెఁ దనివిబొందిఁచవయ్యా ॥ కొలు ॥

సరుసఁ గూచుండినట్టిసకియకు నిదివో
సిరులుగాఁ బులకించె చెక్కులెల్లాను
తెరవేసుకొని సిగ్గుదేరిచి గుట్టునసె
గరిమతో లోలోనె కాఁగిలించవయ్యా ॥ కొలు ॥

శ్రీసతికి భూసతికిఁ జేరి కూడఁగ నిదివో
రాసి నిట్టూర్పులు మిఁచె రతులలోనా
ఆసతోడుత శ్రీవేంకటాద్రిగోవిందరాజ
లేసుగా నిద్దరిని లాలించఁగదవయ్యా ॥ కొలు ॥ 33

వరాళి

ఎంతలేదు నీయాసోద మేమిచెప్పేది
బంతినుండి రతులకే బాఁతిపడేవు ॥ పల్లవి ॥

చెలులై తేఁజాలు నట్టె చేరి యెంతవడియైనా
మలసి మలసి నీవు మాటలాడేవు
కొలఁదిమీరినయట్టికుచముల గంటేఁజాలు
యెలమి నూరకయైనా యేఁకారేవు ॥ ఎంత ॥

తప్పకఁ జూచితేఁ జాలు తనియక మీఁదమీఁద
వుప్పతిలుఁదమకాన నోలలాడేవు
చిప్పిల నవ్వితేఁ జాలు చెంతల నట్టెభ్రమసి
వొప్పగుమోవితేనెకు నొగి నోరూరేవు ॥ఎంత॥

కాఁగిలించుకొంటేఁ జాలు కమ్మసంతోసముతోడ
చేఁగదేరి వలపుల చిమ్మురేఁగేవు
వీఁగక శ్రీ వేంకటేశ వెస నన్నుఁ గూడితివి
పొఁగినతరితీపులఁ బచ్చిదేరేవు ॥ఎంత॥ 34

## ముఖారి

ఏమే విభునినేల యెలయించేవే నీ—
మోమున సింగారలు మొలచున్నవి ॥పల్లవి॥

నెలవుల నొకమాటు చేరి నీవు నవ్వితేనే
వెలలేనిమహిమలవెన్నెల గాయు
తళుకున నీవటు తప్పక చూచితేనే
నిలువెల్లాఁ జీఁకటుల నిగ్గుదేరును ॥ఏమే॥

మురిపేన వాతెరమోవి నీవు చూపితేనే
సొరిదినే పగడాలసొంపు నిండును
మరుగుచు నీవిట్టె మాటలు సారె నాడితే
యిరవై కప్రపుపలుకు లిటు నిండును ఏమే॥

సందడి నీపయ్యదలో చన్నులు చూపితేనే
కుందణం(నం?)పువన్నెలెల్లా గుదిగొనును
కందువ శ్రీవేంకటేశుఁ గాఁగిట నీవు గూడితే
యెందు నలమేల్మంగ నీయిరవు గాన్పించును ॥ఏమే॥ 35

సింధురామక్రియ

ఎంత వేడుకకాఁడవు ఇన్నిటా నీవు
సంతసించేవు మోహము చల్లినంతనె ॥పల్లవి॥

వన్నెవచ్చె మేనికిని వాడుదేరె మోమెల్ల
కన్నులను నాపె నీవు గాంచినంతనె
చెన్నుమీర సంతోసాన చెక్కులెల్లాఁ బులకించె
పన్నుగా నాకెమాటలు విన్నంతనె ॥ఎంత॥

ఆసపుట్టె మనసుకు అరిమురిఁ జెమరించె
నేసవెట్టి యాపె నిన్నుఁ జేరినంతనె
వాసిమీర పైపైనే వలపులు గడుమించె
చేసన్నలు నీయెడకుఁ జేసినంతనె ॥ఎంత॥

నిట్టూరుపులు రేఁగె నిండుఁదమకము నిండె
గుట్టుతోడ నీవు రతిఁ గూడినంతనె
అట్టె శ్రీ వేంకటేశ ఆనందము గడునుబ్బె
చుట్టి ఆకెఆయములు సోఁకినంతనె ॥ఎంత॥ 36

రేకు 907 ఆహిరి

ఎడసి కూడినపొందు ఇంపులాయను
తడవి మీభావములు తలపోసేమయ్యా ॥పల్లవి॥

చెక్కునఁ బెట్టినచెయ్యి సెలవిఁ బారేటినవ్వు
వొక్కమాటే చెలియకు నొనగూడెను
నిక్కపువోరమణుఁడ నీమహిమలే ఇవి
మిక్కిలి మాలో నేమే మెచ్చుకొనేమయ్యా ॥ఎడ॥

మేరమీరు నిట్టూర్పులు మితిమీరు తమకము
యీ రెండు నింతికి నిట్టె ఇరవాయను
ఆరయ వోరమణుఁడ అమరించితివి రీతి
యేరుపరచి మీసుద్దు లెంచుకొనేమయ్యా ॥ ఎడ ॥

పయ్యదలెడజారును పచ్చిదేరేరతిచొక్కు
నెయ్యపుఁగామిని కిట్టె నెలవాయను
యియ్యెడ శ్రీవేంకటేశ యెనసితి వింతలోనె
చయ్యన మిమ్ముఁ బొగడి సంతోసించేమయ్యా ॥ ఎడ ॥ 37

బౌళి

చెక్కునొక్కి ఇచ్చకము సేతురుగాక
వెక్కసపు సేఁతలను వింత సేతురా ॥ పల్లవి ॥

వలచినరమణుఁడు వాడికెతు నీమీఁద
కలువల వేసితేను కాఁతాళింతురా
తలుపుదెరచి నీదండఁ గూచుండినవాని
చలపట్టి బొమ్మలను జంకింతురా ॥ చెక్కు ॥

పొందైనమగవాఁడు బుజముపైఁ జెయివేసి
కందువ లంటితేనే కాదందురా
విందులమోవి చూపి విడెమడిగేటివాని
మందెమేళములాడుచు మారుకొందురా ॥ చెక్కు ॥

శ్రీవేంకటేశుఁడు చేరి నిన్నుఁ గాఁగిలించి
ఆవటించి కూడితేనే అలయుదురా
చేవులవంటా నిన్నుఁ దెగడి నవ్వించేవాని
కావరపుఁజూపు చూచి కాతరింతురా ॥ చెక్కు ॥ 38

లలిత

చిత్తగించవోయి నీవు శిరసువంచుకొనక
బిత్తరాన నీకె నీపై ప్రియము చల్లీని ॥ పల్లవి ॥

పలుచనిసిగ్గుతోడ బాసికము గట్టుకొని
చెలరేఁగి సతి నీపై నేసచల్లీని
చెలులమాటుననుండి చిప్పిలుఁదమకమున
తళుకుఁజూపుల నిన్ను తప్పక చూచీని ॥ చిత ॥

చెంది మురిపెముతోడ సింగారించుకొని
కందువ లంటుచు నీకాలుదొక్కీని
సందడివేళలందు జాణతనాలాడి నీకు
ముందుముందుగాఁ దాను మోవి చూపీని ॥ చిత్త ॥

గాటఁపుటాసలతోడ కంకణము నీకుఁ గట్టి
పీఁటమీఁదఁ గూచుండి పెండ్లాడీని
యీటున శ్రీవేంకటేశ యిటు నన్నుఁ గూడితివి
మేటివై యిందుకు నాపె మెచ్చు మెచ్చీసి ॥ చిత్త ॥ 39

అమరసింధు

ఉచిత మెఱఁగవద్దా వువిదలకు
రచనల నీసరి రాజా యెవ్వరును ॥ పల్లవి ॥

యింతులెల్లా నిలుచుండి యిట్టె కొలువు సేయఁగ
మంతనములాడేవు మగనితోను
పంతవై నీవొకతెవే జట్టిగొంటివా యేమి
వంతువరుసలు మరివలదా యెవ్వరికి ॥ ఉచి ।

